ములతో, స్పర్ధి = సమానము లగు, పుష్ప = పుష్పములయొక్క, ఋద్ధి = వృద్ధియే, మౌళేః = శిఖరముగాఁ గల్గిన, అశోకానోకహస్య = అశోక వృక్షముయొక్క, ఉపమూలమ్ = మొదలునకు సమీపమున, స్మరతరళమ్; స్మర = మన్మథునిచే, తరళం = చంచలమైన, కిసలయదళతల్ప మ్లాపినమ్; కిసలయదళ = చిగురుటాకులయొక్క, తల్ప = పడకను, మ్లాపినం = కదులునట్లు చేయుచున్న, తమ్ = ఆ, నృపం = నలమహారాజును, ప్రాప = పొందినది.

సమాసములు:—

తత్తీరభాజః :— తస్య తీరమ్ = తత్తీరమ్, తత్తీరం భజతీతి = తత్తీరభాక్, తస్య = తత్తీరభాజః.

స్మరతరళమ్:— స్మరేణ తరళః = స్మరతరళః. తమ్ = స్మరతరళమ్.

అశోకానోకహస్య:— అశోక ఇతి అనోకహః = అశోకానోకహః తస్య = అశోకానోకహస్య.

ఉపమూలమ్:— మూలస్య సమీపే = ఉపమూలమ్.

కిసలయదళతల్పమ్లాపినమ్:— కిసలయాని చ తాని దళాని చ = కిసలయదళాని, కిసలయదళాన్యేవ తల్పమ్ = కిసలయదళతల్పమ్, కిసలయదళతల్పం మ్లాపయతీతి కిసలయదళతల్పమ్లాపీ, తమ్ = కిసలయదళతల్పమ్లాపినమ్.

జ్వలదసమశరేషుస్పర్ధిపుష్పర్ధిమౌళేః:— అసమాః శరాః యస్య సః = అసమశరః, అసమశరస్య ఇషవః = అసమశరేషవః, జ్వలంతశ్చ తే అసమశరేషవశ్చ = జ్వలదసమశరేషవః, జ్వలదసమశరేషుభిః స్పర్ధినీ = జ్వలదసమశరేషుస్పర్ధినీ, పుష్పాణాం ఋద్ధిః = పుష్పర్ధిః, జ్వలదసమశరేషుస్పర్ధినీ చ సా పుష్పర్ధిశ్చ = జ్వలదసమశరేషుస్పర్ధిపుష్పర్ధిః, జ్వలదసమశరేషుస్పర్ధిపుష్పర్ధిః మౌళిః యస్య సః = జ్వలదసమశరేషుస్పర్ధిపుష్పర్ధిమౌళిః, తస్య = జ్వలదసమశరేషుస్పర్ధిపుష్పర్ధిమౌళేః.

భావము:

ఆ హంస యాకసమునఁ బయనము గావించి తొలుత తాను నలమహారాజును గాంచిన కొలనిగట్టున మొలచినదై మన్మథునియొక్క జ్వలించు

బాణములతో సమాన మగు పుష్పసంపత్తి గల్గిన యశోకవృక్షముక్రింద చిగురు పాన్పుపైఁ బరుండి దానిని దనవిరహతాపముచే, వాడునట్లు చేయుచు కామ చాంచల్యము నొందిన నలమహారాజును గాంచెను.

శ్లో॥ పరవతి దమయంతి త్వాం న కించిద్వదామి
ద్రుతముపనమ కిం మామాహ సా శంస హంస।
ఇతి వదతి నలేఽసౌ తచ్ఛశంసోపనమ్రః
ప్రియమను సుకృతాం చ స్వస్పృహాయా విలంబః॥ ౧౩౪

ప. వి. పరవతి। దమయంతి। త్వాం। న। కిం। చిత్। వదామి। ద్రుతమ్। ఉపనమ। కిం। మామ్। ఆహ। సా। శంస। హంస। ఇతి। వదతి। నలే। అసౌ। తత్। శశంస। ఉపనమ్రః। ప్రియమ్। అను। సుకృతాం। చ। స్వస్పృహాయాః। విలంబః।

టీక॥ పరవతి = పరాధీన మగు, దమయంతి = ఓ దమయంతీ! త్వాం = నిన్ను గూర్చి, కించిత్ కొంచెము గూడ, న వదామి = చెప్పను, (కించ = మఱియు) హేహంస = ఓ హంసా, ద్రుతం = శీఘ్రముగ, ఉపనమ = రమ్ము, సా = ఆ దమయంతి, మాం = నన్ను గూర్చి, కిమ్ = దేనిని, ఆహ = పలుకుచున్నది, శంస = చెప్పుము, ఇతి = ఇట్లు నలే = నలమహారాజు, వదతి = చెప్పుచుండగా, అసౌ = ఈ హంస, ఉపనమ్రః = సమీపమును బొంది, తత్ = దాని నంతయు, శశంస = చెప్పెను, సుకృతామ్ = పుణ్యవంతులకు, ప్రియమను = ఇష్ట మైన వస్తువును గురించి, స్వస్పృహాయాః = తమకోరికకే, విలంబః = ఆలస్యము.

"హంస నలునకు కార్యసిద్ధినిఁ జెప్పె నను" విశేషార్థము "సాధువులు కోరుటలోనే యాలస్యము గాని, కోరినచో కార్యసిద్ధికిఁ దడవు జరుగ"దను సామాన్యార్థముచే సమర్థింపఁబడుటవలన నర్థాంతర న్యాసాలంకారము.

సమాసములు:

పరవతి:_ పరః అస్యాః అస్తీతి = పరవతీ, తస్యాస్సంబుద్ధిః = హేపరవతి!

భావము:_

"ఓ పరతంత్ర మయిన దమయంతీ! నిన్ను నేను నిందించను. ఓ హంసా! శీఘ్రముగ దిగిరమ్ము. ఆదమయంతి నన్ను గూర్చి నీతో నేమి చెప్పినది. దానిని జెప్పుము." అని నలుఁడు హంసను జూడకయే భ్రాంతితో హంసను సంబోధించి పలుకుచుండగా నట్టితరుణమున వాస్తవముగనే యీహంస యతని ముంగిట దిగి దమయంతీవృత్తాంతము నంతయును జెప్పెను. సాధువు లేవిషయమును గూడ సాధారణముగాఁ గోరరు. వారు దేని నైనను గోరుట లోనే యాలస్యము. కాని వారు గోరినచో కార్యసిద్ధిలో నాలస్య మేర్పడదు.

శ్లో॥ కథితమపి నరేంద్రశ్శంసయామాస హంసం
కిమితి కిమితి పృచ్ఛన్ భాషితం స ప్రియాయాః।
అధిగతమతివేలానందమార్ద్వీకమత్తః
స్వయమపి శతకృత్వస్తత్తథాన్వాచచక్షే॥ ౧౩౧

ప. వి. కథితమ్ । అపి । నరేంద్రః । శంసయామాస । హంసం । కిమ్ । ఇతి కిమ్ । ఇతి । పృచ్ఛన్ । భాషితం । సః । ప్రియాయాః । అధిగతమ్ అతివేలానందమార్ద్వీకమత్తః । స్వయమ్ । అపి । శతకృత్వః । తత్ । తత్ । తథా । అన్వాచచక్షే ।

టీక॥ సః = ఆ, నరేంద్రః = నలమహారాజు, కథితమపి = తనకు హంసచే చెప్పఁబడినను, ప్రియాయాః = ప్రియురా లగు దమయంతియొక్క. భాషితం = మాటను, కిమితి, కిమితి = ఏమి యేమి యని, పృచ్ఛన్ = అడుగుచు, హంసం = హంసను, శంసయామాస = మరల మరల చెప్పించుచుండెను, (కించ = మఱియు), అతివేలానందమార్ద్వీకమత్తః; అతివేల = పారము లేని, ఆనంద = సంతోష మను, మార్ద్వీక = ద్రాక్షామద్యముచే, మత్తః = మదించినవాఁడై, అధిగతం = చక్కఁగా

గ్రహింపఁబడిన, తత్ = ఆ హంస చెప్పిన విషయమును, స్వయమ పి = తానును, శతకృత్వః = పెక్కుమాఱులు, తథా = ఆ హంస చెప్పిన విధముగనే, అన్వాచచక్షే = అనువదించుచుండెను.

సమాసములు ;

నరేంద్రః :- నరాణామింద్రః = నరేంద్రః.

అతివేలానందమార్ద్వీకమత్తః :- వేలామతిక్రాంతః = అతివేలః, అతివేలశ్చాసౌ ఆనందశ్చ = అతివేలానందః, మృద్వీకాయాః వికారః = మార్ద్వీకమ్, అతివేలానంద ఏవ మార్ద్వీకమ్ = అతివేలానందమార్ద్వీకమ్, అతివేలానందమార్ద్వీకేన మత్తః = అతివేలానందమార్ద్వీకమత్తః.

భావము :

ఆ నలమహారాజు హంస తనకుఁ జెప్పిన ప్రియురాలివిషయమునే మాటి మాటికి నడుగుచు నా హంసచే మఱల మఱల చెప్పించుచుండెను. మఱియు నపార మగు నానంద మను ద్రాక్షపండ్లమద్యముచే మదముఁ జెందినవాడై హంస చెప్పుటవలన తాను చక్కగా గ్రహించిన దమయంతీవృత్తాంతమును దాను గూడ బెక్కుమాఱులు హంస చెప్పిన విధముగనే పలుకుచుండెను.

శ్లో॥ శ్రీహర్షం కవిరాజరాజిమకుటాలంకారహీరస్సుతం
శ్రీహీరస్సుషువే జితేంద్రియచయం మామల్లదేవీ చ యమ్
తార్తీయీకతయా మితోఽయమగమత్తస్య ప్రబంధే మహా
కావ్యే చారుణి నైషధీయచరితే సర్గో నిసర్గోజ్జ్వలః॥ ౧౩౬

ప. వి. శ్రీహర్షం । కవిరాజరాజిమకుటాలంకారహీరః । సుతం । శ్రీహీరః । సుషువే । జితేంద్రియచయం । మామల్లదేవీ । చ । యమ్ । తార్తీయీకతయా । మితః । అయమ్ । అగమత్ । తస్య । ప్రబంధే । మహాకావ్యే । చారుణి । నైషధీయచరితే । సర్గః । నిసర్గోజ్జ్వలః ।

టీక॥ కవిరాజరాజిమకుటాలంకారహీరః; కవిరాజ = కవిశ్రేష్ఠుల, రాజి = పరంపరయొక్క, మకుట = మకుటములకు, అలంకార = భూషణమైన,

హీరః = వజ్రమణి యగు, శ్రీహీరః = శ్రీహీరుఁడను విద్వాంసుఁడు, జితేంద్రియచయం; జిత = జయింపఁబడిన, ఇంద్రియ = చక్షురాదీంద్రియములయొక్క, చయం = సమూహము గల్గిన, శ్రీహర్షమ్ = శ్రీహర్షుఁ డను నామము గల్గిన, యం = ఏ, సుతం = కుమారుని, సుషువే = పుట్టించెనో, మామల్లదేవీ చ = మామల్లదేవి యనుతల్లియు, యం = ఏ, సుతం = కుమారుని, సుషువే = కనెనో, తస్య = అతవియొక్క, ప్రబంధే = ప్రకృష్టబంధము గల్గిన, చారుణి = చమత్కృతి సముల్లసిత మైన, నైషధీయచరితే; నైషధీయ = నలునకు సంబంధించిన, చరితే = చరిత్రయైన. అనగా నైషధీయమను నామము గల, మహాకావ్యే = మహాకావ్యమందు, తార్తీయీకతయా = మూడవదిగ. మితః = లెక్కింపఁబడిన, నిసర్గోజ్జ్వలః; నిసర్గ = స్వభావముచే, ఉజ్జ్వలః = ప్రకాశమాన మగు, సర్గః = సర్గ, అగమత్ = సమాప్తిని బొందినది.

సమాసములు :

కవిరాజరాజిమకుటాలంకారహీరః :- కవీనాం రాజానః = కవిరాజాః, కవిరాజానాం రాజిః = కవిరాజరాజిః, కవిరాజరాజేః మకుటాని = కవిరాజరాజిమకుటాని, కవిరాజరాజిమకుటానామలంకారః = కవిరాజరాజిమకుటాలంకారః. కవిరాజరాజిమకుటాలంకారశ్చాసౌ హీరశ్చ = కవిరాజరాజిమకుటాలంకారహీరః.

జితేంద్రియచయమ్ - ఇంద్రియాణాం చయః = ఇంద్రియచయః, జితః ఇంద్రియచయః యేన సః = జితేంద్రియచయః, తమ్ = జితేంద్రియచయమ్.

తార్తీయీకతయా :- తృతీయ ఏవ తార్తీయీకః, తార్తీయీకస్య భావః = తార్తీయీకతా, తయా = తార్తీయీకతయా.

నైషధీయచరితే :- నిషధానాం రాజా = నైషధః, నైషధస్య ఇదమ్ = నైషధీయమ్. నైషధీయం చ తత్ చరితం చ = నైషధీయచరితమ్, తస్మిన్ = నైషధీయచరితే

నిసర్గోజ్జ్వలః :- నిసర్గేణ ఉజ్జ్వలః = నిసర్గోజ్జ్వలః.

భావము :

కవిరాజులశ్రేణికి మౌళిభూషణ మగు వజ్రమణి యైన శ్రీహీరుఁ డను విద్వాంసుడును, మామల్లదేవియు నింద్రియనిగ్రహము గావించిన శీలవంతు డైన శ్రీహర్షు డను పుత్రుని కనిరి. అతని ప్రబంధ మగు మహాకావ్యమైన నైషధీయ చరితమునందు మూడవదిగ లెక్కింపఁబడిన స్వభావసుందర మగు నీ సర్గ సమాప్తి నొందినది.

ఇట్లు

శ్రీ మదాపస్తంబసూత్రాఽఽత్రేయగోత్ర

శ్రీ మదుడాలి నృసింహశాస్త్రి

తనూజ

శ్రీ విక్రమసింహపురీవేదసంస్కృతకలాశాలా ప్రధానోపాధ్యాయ

సుబ్బరామశాస్త్రి విరచిత

నైషధీయచరితాంధ్రవ్యాఖ్యానమున

తృతీయసర్గ సమాప్తము